సీ. న్యాయమార్గముఁ దప్పి నరులను వేధింప
రాజు గాఁడతఁడు తరాజు గాని
పతిభక్తి విడిచి సంపద నొందుజవరాలు
ఆలు గాదది పేచులాలు గాని
తల్లిదండ్రులమాట దాఁటిన సుతుఁడు దా
సుత్ముఁడు గాఁడతఁడు కుత్సితుఁడు గాని
అతిథిభాగవతుల నర్చింపలేనిల్లు
యిల్లు గా దది వల్లిపొల్లు గాని
పరమధర్మజ్ఞుఁడే రాజు భక్తిగలదె
యాలు సుగుణుండె కొడుకు పూజార్హ మిల్లు
సురుచిరాకార... 70

సీ. కరణంబు కాఁపులుఁ గలహించుచుండిరా
యూరుగాదది లత్తుకోరు గాని
అర్థులు వేఁడిన నడియాస వెట్టినా
దాతగాఁడాతఁడు ప్రేత గాని
ధనమిచ్చుదాతపద్యము చదువఁడ యేని
వంది గాఁడాతఁడు పంది గాని
సురుచిరసచ్ఛబ్దశుద్ధి లేకుండెనా
సుకవి కాఁడాతఁడు, కుకవి గాని
వైర ముడిగిన దూరిడువాఁడె దాత
చదువు గలవాఁడె భట్టు వాగ్భూరి యెసు సుకవి
సురుచిరాకార... 71

వినయంబు గలకాంత విడిచి వర్తించెనా
విభుఁడు గాఁ డతఁడు రాసభుఁడు గాని
గురుమంత్ర మెదలోన గుప్తంబు సేయఁడే
వరుఁడు కాఁ డతఁడు వానరుఁడు గాని
ప్రేమతోఁ జన్నిచ్చి పెంచకయుండెనా
తల్లి గా దది మారుతల్లి గాని
ప్రభువు చెప్పినయట్టి పనికి మాఱాడెనా
భటుఁడు గాఁ డతఁడు దుర్భటుఁడు గాని
గుణము గలవాఁడె పతి మంత్రి గోప్త జనుఁడు
పెంచినది మాత పనులు గావింప బంటు
సురుచిరాకార... 72

ఆమయఘ్నుం డైనయాతఁ డభిజ్ఞుఁడు గాని
వెజ్జు గాఁ డాతఁడు జజ్జు గాని
చతురుపాయంబులసరణిఁ దెలియనిమంత్రి
మంత్రి గాఁ డతఁడు దుర్మంత్రి గాని
విదితనానాశాస్త్రవేది గానిబుధుండు
బుధుఁడు గాఁ డతఁడు బుద్బుదుఁడు గాని
శమదమానుష్ఠానసమితిఁ దాల్పక యున్న
తపసి గాఁ డతఁడు కుతపసిగాని
[1]ప్రాజ్ఞుఁడే వెజ్జు సదుపాయపరుఁడె సచివుఁ
డర్థవేది యె సూరి బ్రహ్మజ్ఞుఁడె మునిసురుచి...

1 శాస్త్రి వైద్యుండు.

సీ. ప్రియముతో రమ్మని పిలిచి పెట్టనికూడు
కూడు గా దది పుట్టగూడు గాని
భోగదానములనుఁ బొందరానిధనంబు
ధనము గా దది పన్నెదనము గాని
సత్యవాక్యము నిల్పఁ జాలనిపరుజిహ్వ
జిహ్వ గా దది గోధిజిహ్వ గాని
పరుల కుపకారంబు పట్టిసేయని బ్రతుకు
బ్రతుకు గా దది రోఁతబ్రతుకు గాని
ఒయగలది భోజ్య మక్కరధనము ధనము
పలుకఁదది నాల్క యుపకృతినియతి బ్రతుకు
నరుచిరాకార... 74

సీ. పరసాన్నములఁ దృప్తిసలుపఁజాలని పెండ్లి
పెండ్లి గా దది దూబపెండ్లి గాని
ఆఁసి తారతమ్యము లెఱుంగని పెద్ద
పెద్ద కాఁ డాతఁడు గ్రద్ద గాని
వినయమ్ము లేక వేవే లొసంగిన యీవి
యీవి గా దది మంటిదీవి గాని
బంధువుల్ సమ్మతపడనట్టిశుభము దా
శుభము గా దది విపన్నిభము గాని
తృప్తిఁ బొందినదే పెండ్లి తీర్పు పెద్ద
తనదు వినయమె యీవి బాంధవమె శుభము
మురుచిరాకార... 75

సీ. వల పెంతగల్గిన వారకాంతలమాట
మాట గా దది నీళ్లమూట గాని
కుల మెంతగల్గినఁ గులహీనుతోఁ జెల్మి
చెల్మి గా దది పాముచెల్మి గాని
నెల వెంతకల్గిన నీచులతోఁ బొందు
పొందు గా దది పెట్టుమందు గాని
ధన మెంత గల్గినఁ దా విజాతులసేవ
సేవ గా దది చెడుత్రోవ గాని
మానినిది మాట సుగుణిది మంచితనము
ఘనునితోఁ బొత్తు సత్కులజునిది సేవ
సురుచిరాకార... 76

సీ. పరగ శ్రీవైష్ణవార్పణము సేయనికల్మి
కల్మి గా దది పెద్దకొల్మి గాని
పరమభాగవతసంస్పర్శఁ జెందని నోము
నోము గా దది పెనుగోము గాని
హరిదాసచరణానుసరము గానిజలంబు
జలము గా దదియొ కజ్జలము గాని
కమలాక్షుభక్తసంగతిఁ గోరనిత్రిదండి
దండి గాఁ డతఁడు త్రిదండి గాని
వైష్ణవార్పణసిరి భాగవతమె నోము
ముక్తసంగుఁడె యతి తీర్థములె పదములు
సురుచిరాకార... 77

సీ. స్థిరబుద్ధితో నినుఁ జింతసేయనిదినము
దినము గా దది యొ దుర్దినము గాని
వితతమౌ నీకథ ల్వినకయుండిన చెవుల్
చెవులు గా వవి కొండగవులు గాని
భవదీయనామము ల్పలుకకుండిననోరు
నోరు గా దది డక్కతీరు గాని
పొంపుగా నీమూర్తి సొబగుఁ గాననికనుల్
కనులు గా వవి నీటిదోనలు గాని
చింతగలదియె తిథి వినఁగఁ జెలఁగు శ్రుతులు
పఠనగలదియె నోరు చూపరయ కనులు
సురుచిరాకార... 78

సీ. సతతంబు నీప్రదక్షిణము సేయనికాళ్లు
కాళ్లు గా వవి మరగాళ్లు గాని
అనయముఁ నీపదార్చనము సేయనికరము
కరము గా దది దర్వీకరము గాని
భవదలంకృతసుమభ్రమతఁ జెందనిముక్కు
ముక్కు గా దది పందిముక్కు గాని
చేరి యుష్మత్కథల్ చింతసేయనిబుద్ధి
బుద్ధి గా దది పాపవృద్ధి గాని
వలగొనిన వంఘ్రులును పూజగలవి చేతు
లలరువాసనఁగొను నాస మతిశమంతి
సురుచిరాకార... ... 79

మంత్రప్రభూత్సాహ మహితశక్తిత్రయం
బును రజస్సత్త్వతమోగుణంబు
లును దానధర్మపరోపకారంబులు
వరభవిష్యద్భూత వర్తమాన
ములు లయస్థితి జన్మములు శైత్యమాంద్యసౌ
రభ్యాది లక్షణత్రయము లెఱిఁగి
సరసవేదపురాణ శాస్త్రేతిహాసాది
విద్యాచతుష్టయ విభవ మరసి
నడచుకొను మానవేశుండు పుడమిలోనఁ
బ్రణుతిఁ గాంచును దా సభాపతి యనంగ
సురుచిరాకార... 80

ఘనమనోవాక్కాయకర్మంబులను ధర్మ
కామార్థమోక్షము ల్పేర్మి నెఱిఁగి
రథగజాశ్వపదాతిరమణీయచతురంగ
బలసమేతుఁడగుచు బ్రహ్మచారి
భిక్షువానప్రస్థపితృమాతృబంధుగృ
హస్థులఁ గరుణచే నరసికొనుచుఁ
దగ సామఋగ్యజురథర్వణవేత్తలౌ
భూసురోత్తములను బూజచేసి
వెలయు నరపాలచంద్రుఁ డీయిలను మిగులఁ
బ్రణుతి కెక్కును దా సభాపతి యనంగ
సురుచిరాకార... 81

సీ. అరయఁ బ్రభాతమధ్యాహ్నసాయంకాల
ములను సంధ్యాదికములను దీర్చి
ఘనతరాహవనీయగార్హపత్యసుదక్షి
ణాగ్నిహోత్రులకు హవ్యము లొసంగి
యంశుకాభరణగంధాదిచతుర్విధ
శృంగారములఁ గను రంగు మీఱి
ధరణిఁ గృతత్రేతద్వాపరకలియుగ
ధర్మప్రవర్తనఁ దవరఁ బ్రజలఁ
గరుణ నేలినరాజశేఖరుఁడ వై జగతిఁ
బరిఢవిల్లును దా సభాపతి యనంగ
సురుచిరాకార...

సీ. భూజలతేజోనభోవాయుపంచక
భూతాత్మకుఁడ వని బుద్ధి నెఱిఁగి
యలరుప్రాణాపానవ్యానాదిప్రాణవా
యువు లున్నతావుల యుక్తిఁ దెలిసి
రూఢి శబ్దస్పర్శరూపరసగంధంబు
లేనింటియందలి యెఱుక గలిగి
త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణనిర్మల
పంచేంద్రియంబులఁ బదిలుఁ డగుచు
వెలయ భూపాలముఖ్యుఁ డీవిశ్వమునను
బ్రస్తుతికి నెక్కు దా సభాపతి యనంగ
సురుచిరాకార...

సీ. మాఘురఘువంశకుమారసంభవమేఘ
సందేశభారవిసముపయార్థ
మెఱిఁగి భాట్టప్రభాకరతర్కమీమాంస
వేదాంతవైశేషికాదికములు
దెలిసి వ్యాకరణజ్యోతిషకల్పశిక్షాని
రుక్తఛందస్సుల యుక్తికలిగి
యాజనాధ్యాపకాధ్యయనదానప్రతి
గ్రహాయజనాఖ్యషట్కర్మనిరతు
లైనవిప్రుల నరసినమానవేశుఁ
డతులగతి నొప్పుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... 84

సీ. ఘనహరిశ్చంద్రసగరపురూరవనల
పురుకుత్సకార్తవీర్యులచరిత్ర
మెఱిఁగి పౌరాణికపరిహాసవిద్వాంస
భటకవిసప్తాంగభరితుఁ డగుచు
ధనధాన్యవస్తువాహనమిత్రసంతాన
బాంధవాద్యష్టసంపదలు గలిగి
నిధితటాకారామనిర్జరాలయకృతి
భూసురస్థాపనపుత్త్రు లనెడు
సప్తసంతానములను బ్రశస్తిఁ జైన
ప్రభువునకుఁ జెల్లుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... 85

సీ. భోజనవస్త్రతాంబూలగంధప్రియ
కామినీసంగీతకనకభూష
ణాదుల మృదుశయ్య లనఁ దగునష్టభో
గము లనుభవింపుచుఁ గటుకషాయ
తిక్తామ్లమధురవార్ధిజముఖ్యషడ్రస
ముల నెఱుఁగుచు భక్ష్యభోజ్యలేహ్య
పానీయచోష్యసుపంచవిధాహార
ముల నతిథులఁ దృప్తి బొందఁజేసి
చెలఁగి విహరించుమనుజుఁడే క్షితితలమున
బ్రతిభఁ గాంచును దా సభాపతి యనంగ
సురుచిరాకార...

సీ. వీర బీభత్సశృంగారకరుణాద్భుత
శాంతాదినవరసస్వాంతుఁ డగుచుఁ
గులరూపయౌవనస్థలధనవిద్యాప్ర
భుత్వాష్టమదములఁ బెనఁగుగొనక
నిధిజలపాషాణనిక్షేపకక్షోణి
కాగామిసిద్ధసాధ్యస్వామ్యంబు లనెడి
యష్టభోగములతో నైనగ్రహారామ
క్షేత్రముల్ భూసురశ్రేణి కొసఁగు
పురుషసింహుండు వెలయు నీపుడమిలోన
వితతయశుఁ డనఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార...

సీ. శాల్మలిప్లక్షకుశక్రౌంచపుష్కర
  శాకజంబూద్వీపసరణి విజయ
శాసనంబులు నిల్పి చంద్రసూర్యాంగార
  కాదిగ్రహబలవిహారుఁ డగుచు
సంస్కృతమగధపైశాచికప్రాకృతా
  పభ్రంశకాద్యష్టభాష లెఱింగి
శబ్దవిరోధదుస్సంధిపునరుక్తి ఛం
  దోభంగముఖదశదోషరహితు
లైనకవిరాజులను బ్రీతి నరసికొనినఁ
బ్రాజ్ఞుఁడై యొప్పుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... ౪౮

సీ. అంగలాటదశార్ణకాంగకాంభోజకే
  కయఘూర్జరకిరాతగౌళసాల్వ
బాహ్లీకశాల్మలబార్బరనేపాళ
  పాంచాలమలయాళపాండ్యమత్స్య
సౌరాష్ట్రకోసలసౌవీరటెంకణ
  కొంకణగాంధారకురుయుగంధ
రాంధ్రకళింగమహారాష్ట్రమాళవ
  ప్రముఖచప్పన్నదేశములభాష
లెఱింగి ధర్మప్రవర్తనఁ దిరుగురాజు
భాసిలుచు నుండుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... ౪౯

సీ. కేశవ మాధవ కృష్ణ హృషీకేశ
వామ నాచ్యుత హరి వాసుదేవ
దామోద రానిరుద్ధ జనార్దన నృసింహ
ప్రద్యుమ్న గోవింద పద్మనాభ
నారాయణోపేంద్ర ధీర మధుసూదన
శ్రీధ రాధోక్షజ శ్రీశ విష్ణు
సత్పుండరీకాక్ష సంకర్షణ త్రివి
క్రమ యనునామముల్ క్రమముతోడ
నేనరుండైనఁ బఠియింప నిహపరముల
సౌఖ్య మొసఁగుదు వఁట యెంతసదయమతివి
సురుచిరాకార... 90

సీ. ధరలోన నేజాతినరుఁడైన శంఖచ
క్రాంకితుఁడై భక్తి నలరెనేని
చిద్రోర్ధ్వపుండ్రంబుఁ జెన్నుమీఱ ధరించి
దాసనామంబునఁ దనరెనేని
మదిని అష్టాక్షరీమంత్రజపం బొన
రించి వనమాల వహించునేని
సద్గురుకృపచేతఁ జరమార్థవిభవంబుఁ
దెలిసి పరతంత్రుఁడై నిలిచెనేని
యతనికలుషము లెల్లను హతముచేసి
పరమపద మిత్తు వఁట యెంత సరసమతివి
సురుచిరాకార.... 91

ప్రహ్లాద నారద బలి భీష్మ రుక్మాంగ
    దార్జున పుండరీ కాంబరీష
సనకసనందన శౌనక వ్యాస ప
    రాశర ధ్రువ బాదరాయణ గుహ
విదుర విభీషణ వినతాతనూభవ
    గజరాజ వాల్మీకి భుజగనాథ
పవనతనూజ యుద్ధవ వసిష్ఠాదిభా
    గవతోత్తములు నీదుకరుణఁ బడసి
తావకీయాంఘ్రి సేవలఁ దగిలి జన్మ
రహితులై కాంచి రంట భవన్మహితపదవి
సురుచిరాకార...  92

హాలకులిశాంకుశ జలజశంఖరథాంగ
    కల్పక రేఖా ప్రకాశితములు
అభినవవికసనహల్లకదళనిభ
    పరిపూర్ణ శోణభా భాసురములు
హరజటాజూటనృత్యత్తరంగోజ్జ్వల
    గంగానదీజన్మ కారణములు
అఖిలమౌనీంద్రహృదంతర రంగస్థ
    లస్ఫురన్నాట్య విలాసములును
భద్రకరములు భవదీయపదయుగములు
నామనోవీథి నిలుపవే నలిననాభ
సురుచిరాకార...  93

సీ. సకలయోనులయందు జన్మించి జన్మించి
దినములు పొట్టకై తిరిగి తిరిగి
యున్మత్తవృత్తిచే నుప్పొంగి యుప్పొంగి
పంచేంద్రియవ్యాప్తిఁ బరగి పరగి
కలుషజాలంబులు గావించి కావించి
మొగిని సంసారాబ్ధి మునిఁగి మునిఁగి
తనుజరాభారంబుఁ దాలిచి తాలిచి
నరవిఁ గొన్నాళ్లకుఁ జచ్చి చచ్చి
మరలఁ బుట్టంగలేక నీచరణయుగళ
సేవ గోరితి నను దయఁ గావలయు
మరుచిరాకార...

సీ. మర్యాదరహితుఁడ మదనపరవశుండ
వంచనాపరుఁడను గొంచెగాఁడఁ
గలినహృదయుఁడ దుష్కర్ముఁడ నీచుండ
గురుఘాతకుఁడ గృతఘ్నుఁడను దురభి
మానిని లోభిని మత్సరయుతుఁడను
దుర్గుణుండను గురుద్రోహి నైన
నావంటియజ్ఞాను నేవిధంబున నీదు
దయకుఁ బాత్రునిగాఁగఁ దలఁచుకున్నఁ
బతితపావనబిరుదు యేపట్లు నీకు
నిలువఁబోవదు మమ్ము భూతలమునందు
మరుచిరాకార...

సీ. పుత్త్రమిత్త్రకళత్త్రపూరితసంసార
జలధికి నావ మీచరణసేవ
బహుజన్మసంచితపటుఘోరపాతక
సముదయాభావ మీచరణసేవ
బధిరాంధశాబకపశుపతిసుజ్ఞాన
జననప్రభావ మీచరణసేవ
శాశ్వతమహనీయసాయుజ్యపదవికిఁ
జక్కనిత్రోవ మీచరణసేవ
యనుచు వేదాంతసిద్ధమై యలరుచుండుఁ
గాన భవదంఘ్రిసేవయ కలుగఁజేయు
సురుచిరాకార... 96

కఠినతరాజ్ఞానఘనతిమిరార్యమ
కిరణముల్ మీనామకీర్తనములు
చటులదురింద్రియసర్పసముచ్చయ
కేకులు మీనామకీర్తనములు
కలుషౌఘదుర్గమకాననదావాగ్ని
కీలలు మీనామకీర్తనములు
మహితారిషడ్వర్గమదగజసంచయ
కేసరుల్ మీనామకీర్తనములు
గాన మామకహృదయరంగస్థలమున
నర్తనక్రీడ సల్పు మనాథనాథ
సురుచిరాకార... 97

సీ. జపహోమసంధ్యాదిసత్క్రియల్ జేసిన
    నుపవాసములఁ గార్శ్య మొందియున్న
బుణ్యస్థలంబులు పోయి సేవించిన
    మానక దానముల్ పోయి సేయఁ
గాశీప్రయాగగంగానదీస్థలముల
    సకలధర్మంబులు సలుపుచున్న
సారె ధనుఃకోటి స్నానంబు చేసిన
    భక్తి నీయెడ లేక ముక్తి లేదు
కాన నీపదపంకజధ్యానపరుని
గా నొనర్పుము కరుణించి కమలనాభ
సురుచిరాకార...

సీ. అల యజామిళునికలుషంబు లెడలించి
    యొలమితో సాయుజ్య మీయ లేదె?
అపకార మొనరించినట్టికాకాసురుఁ
    గృపతోడఁ జూచి రక్షింపలేదె?
పగవానితమ్ముని మృగధరార్కస్థాయి
    గా లంకఁ బట్టంబు గట్టలేదె?
సభలోన నపరాధశతము పల్కినయట్టి
    శిశుపాలు నాత్మలోఁ జొనుపలేదె
నీదయారస మొరులు వర్ణింపఁ గలరె
నన్ను గరుణింపు మిదె నీకు విన్నపంబు
సురుచిరాకార...

సీ. జపహోమసత్క్రియల్ సలుపంగ నోప నే
నుపవాసములఁ గ్రుస్సి యుండ నోప
పుణ్యస్థలంబులు పోయి చూడఁగ నోప
స్నానసంధ్యావిధుల్ పూన నోప
కాశి గంగాప్రయాగములకుఁ బో నోప
సకలధర్మంబులు జరుప నోప
అఖిలవ్రతంబుల నాచరింపఁగ నోప
నిరతాన్నదానంబు నెఱప నోపఁ
గనుక నిజదాసనఖ్యంబుఁ గలుగఁజేసి
నీదునామంబు జిహ్వను బాదుకొలుపు
సురుచిరాకార... 100

సీ. నాలుక కేశవనామము నొడువుము
చిత్తమా హరిమీఁదఁ జింత నిలుపు
పాణియుగంబ శ్రీపతిపూజ సేయుము
కర్ణద్వయమ విష్ణుకథలు వినుము
పదయుగ శ్రీధరభవనంబు వలగొను
నయనయుగ్మమ యదునాథుఁ జూడు
నాసాపుటమ జగన్నాయకశ్రీపాద
తులసి నాఘ్రాణించు మలర ననుచు
నవయవంబుల మనవిగా నడుగుకొంటి
విన్నపము లెంత చేసియు వేఁడుకొంటి
సురుచిరాకార... 101

సీ. శ్రీరాజగోపాలశేఖరపరమహేమో
  న్నతగోపురంబు ఉన్నవపురంబు
ప[illegible]ంసహాచక్రసంచరద్భారతీ
  నాట్యరంగంబు ఉన్నవపురంబు
కామితాఖిలవస్తుకల్పనారుచిరాభి
  నవగోపురంబు ఉన్నవపురంబు
సంలితనిర్మలసలిలధారాపూర
  నలినాకరంబు ఉన్నవపురంబు
నవనిధిశ్రీకరంబు ఉన్నవపురంబు
సరసఖస్థావరంబు ఉన్నవపురంబు
సురుచిరాకార ఉన్నవపురవిహార
రాజగోపాల రాధామనోజఖేల.

తే. శ్రీరమణీకుచకుంభిత
ఘటీరమ్యకురంగమదపటీరసుగంధ
వాస్రరోపితవక్షస్థల
గోపతిపరిపాలరాజగోపాలహరి!

రాజగోపాలశతకము

సంపూర్ణము.

---

# పీఠిక.

ఈ మానసబోధశతకమును తాడేపల్లి పానకాల రాయఁడను కవి రచించెను. కవి కాలము కులము గోత్రాదికము తెలుసుకొనుటకుఁ దగిన యాధారము లీశతకమునందుఁ గనఁబడవు. చిత్తబోధ శతకమునఁ గల విప్రుఁడవను విశేషమువలనఁ గవి బ్రాహ్మణుఁ డని నిశ్చయింప వీలుచిక్కినది. పానకాలు కవి పై రెండుశతకములే గాక పార్థసారథిశతకము రామ శతకము లక్ష్మీదేవిశతకము నృసింహస్వామిశతకము రుక్మిణీపతిశతకము నేత్రదర్పణము వైద్యశాస్త్రము రచించెను. నేత్రదర్పణములోనిదగు

"సీ. శ్రీవత్సగోత్రుఁ డంచితపటుశాస్త్ర సం
ఖ్యావతీ దేవకులాగ్రగణ్యుఁ
డగు తాడెపల్లి...
పానకాలరాయఁ డనువాఁడ..."

అను పద్యమువలన నీకవి శ్రీవత్సగోత్రుఁడనియు నారువేలనియోగియనియుఁ దెలియును. నేత్రదర్ప ణములోని

"సీ. గీ. సీటుగానెన్నఁదగుఁ గొండవీటిసీమ...

వ. అట్టిసీమాప్రదేశంబునను దగ్భాగంబున...కృష్ణా
తీరంబున...

కం. పదపడి ముదమలరు తాడెపల్లిధరిత్రిన్."

అను పద్యములవలన తాడేపల్లి పానకాలుకవి బెజ వాడకుఁ జెంతగల తాడేపల్లినివాసి. పానకాలుకవి మానసబోధశతకము వ్రాసి హరికి సమర్పించెను. కాసులపురుషోత్తముఁడు తానొక మానసబోధశత కము రచించెను. అది ప్రకృత మనుపలభ్యమగుటవ లన నీకవి దానిని దొంగలించి మార్చికొనియుండునని శతకకవిచరిత్రకారులు వావిడిచియున్నారు. పానకాల కవి చౌర్య మొనరించెననుటకుఁ దగినన్ని దృష్టాంత ములు సంపాదింపక పురుషోత్తమకవి శతకము కాన కానంతన నిటుల నెంచుట ప్రమాదమనఁదగును. నూ టయిరువది సంవత్సరములనాఁటి రామదాసుచరిత్ర ములో నీమానసబోధశతకములోని పద్యము లుద హరింపఁబడుటవలన నీపానకాలుకవి నూటయేబది సంవత్సరముల కించుక పైకాలమువాఁడనితోఁచును. ఇతనిగ్రంథములు లక్షణగ్రంథములలో నుదాహ రింపఁబడక పోవుటవలన నంతకుఁ బైవాఁడని తెలుప వీలు లేదు.

మానసబోధశతకము కేవలభగవచ్చింతనముతో భక్తిరసప్రతిపాదకముగ నున్నది. ఈశతకము మహాపరాజయోగ సంధాయకమని కవి చెప్పినమాట సత్యము. శ్రీమహాత్ముని లీలావతారముల నభివర్ణించుచు మనమునందుఁ జొన్పుటయే నైహికములను వరించువిధమని కవిమృదుమధుర కవితాస్నిగ్ధమగు సుకుమారవచనములతో నుడివి పామరజనులఁ భగవచ్చింతనమునకుఁ బురికొల్పుచున్నాఁడు. ఇందలిపద్యము లైహికబంధములు నిస్సారములనియుఁ గళేబరము మలమూత్రస్విన్నము గావున దానిపై మమకారము బెట్టుకొనరాదనియు జన్మబంధదూరముగు పరమాత్ముని సన్నిధిజేరుటకుఁ బ్రయత్నించుమనియు బోధించుచున్నవి. ప్రజాసామాన్యమునం దీశతకము మిగుల వ్యాప్తినొందియుంటయే దీని యుత్కృష్టత కొక దృష్టాంతము.

చిత్తబోధశతక మనునది యొకటి యీకవి పేరుతోఁ గానవచ్చుచున్నది. దానిశైలియు ధారయు విషయ సమీకరణము మానసబోధశతకమునకు మిగుల చేరువలో నున్నది. ఈశతకనిర్మాతయగు

పానకాలురాయఁడే బాల్యావస్థలో చిత్తబోధశతక
మువ్రాసి తృప్తికరముగ నుండమిచేఁ బ్రౌఢవయ
స్సులో మానసబోధశతకము వ్రాసెనేమో యని
తోఁచుచున్నది. కవి వృత్తము దెలుపుపద్యము ఇం
చుకమార్పుతో రెండుపాత్రములలో నొకేవిధము
గా నుంటయుఁగూడ శతకద్వయ మేకకర్తృక మన
సాహసము కలిగించుచున్నది.

నందిగామ. 1-1-26 — ఇట్లు భాషాసేవకులు, శేషాద్రిరమణకవులు

శ్రీ ర స్తు.

తాడేపల్లి పానకాలరాయ కవికృత

# మానస బోధ శతకము.

---

ఉ. శ్రీరమణీమణీహృదయసేవితముల్ నవఫుల్లహల్ల
క, శ్రీరమణీయసుందరవిశేషవిలాసము లబ్జసంభ
వో, దారకిరీటరత్నలలితద్యుతిపూర్ణములక్షరాప
గా, సారతరంబు లంచు మనసా హరిపాదము
లాశ్రయింపుమా. 1

ఉ. దండిగఁ జట్టుజాతిని యథావిధి సంగడగా నొ
నర్చెను, ద్దండతఁ గొండచిల్వను ముదంబునఁ
జేసెను దివ్యదేహింగాఁ, బండితులైనవారి నెడఁ
బాయక బ్రహ్మపదంబుఁ జేర్చె నీ, చండితనంబు
మాని మనసా హరిపాదము లాశ్రయింపుమా. 2

చ. సనకసనందనాదిమునిసత్తము లుత్తమభక్తియుక్తి
సా, ధనమున నంబుజాక్షునిపదంబుల సేవ యొ
నర్చి ధన్యులై, మనుట యెఱింగి యింకఁ గొఱ
మాలినవారల వేడనేల నీ, వనవరతానురక్తి
మనసా హరి... 3

ఉ. ...రపు లేనిసంసరణసాగర మీఁదఁగ లేకఁ
జాల వే, సారుచుఁ గర్మబంధములఁ జచ్చుచుఁ
బుట్టుచు సారెసారెకుఁ, దారుణకాలకింకరుల
వంచనకోరువలేవుగాన వి, స్తారసుఖంబు గల్గు
మనసా హరి... 4

చ. పరిపరికర్మబంధములఁ బాయక పుట్టుచుగిట్టుచుఁ
మహా, దురితకళంకపంకమునఁ దూఁగుచు సంసర
ణానుబంధ దు, స్తరజలధిఁ మునింగి జనతఁ
బరతత్త్వముగానలేక వా, సరములు బుచ్చకింక
మనసా హరి... 5

చ. తను వతిచంచలంబు ధనధాన్యములా సట యా
ధనం బహో, కనుఁగొనుచుండ నేగ చనుఁ గా
వున భ్రాంతిని బొంది దుష్టన, ర్తనమున సంచరిం
పకు వృథా కని కానిమఱుంగు జొచ్చె ద, చ్చ
న వీక నెల్ల మాని మనసా హరి... 6

చ. అతిమలినంబు లైనవిషయంబులఁ జిక్కి సదాని
జాత్మ సం, గతి పరిపంథిబంధురవికారములం గడు
స్రుక్కి సర్వకా, మితములు దక్కి చక్కనగు మే
లుపదంబుఁ దలంపలేక నీ, చతఁ బడనేల నీవు మ
నసా హరి... 7

చ. మలినముఁగొంప రోగముల మ్రగ్గెడుసేవఁగంప
జంతుసం, చలనముఁ బొందుదుంప భవసాగర
మీఁదఁగనీదికంప యె, మ్ములు పలలంబు తోలు
నరముల్ మలమొప్పఁదలంప మేను ని, శ్చలమ
ని నమ్మఁబోకు మనసా హరి... 8

చ. అనుఁగులు నాలుబిడ్డలును నన్నలుఁ దమ్ములు నా
దిరైయెనవా, రను వగువేళ వెంటఁ బడి యంత
మునం దొకరైనఁ దోడుగా, వెనుకొని రారు
వారికయి వెఱ్ఱిగఁ బం డ్లిగిలింప నేల నీ, యను
చితవృత్తి మాని మనసా హరి... 9

చ. పెనిచినవాని నమ్మి వెనువెంటనె దిర్గుపాటలు
వానిచే, తన మృతిఁబొందునట్లు నుమి తప్పక శా
లము నిత్యమంచు నీ, వనిశము నమ్మి యుంటి
నకటా యిఁక నేమనుకొందు నింక నీ, వనుపమ
వృత్తి గల్గి మనసా హరి... 10

చ. ఋతుమతి నాతి యంటు చెడ నె గ్గగుతద్రుధి
రంబు శుక్లసం, గతిఁ గని దేహ మయ్యె నది గ
న్గొన దుర్మలమూత్రమాంసశో, ణితక్రిమిజాలసం
కుల మనిత్య మసౌఖ్యము గానఁ గాయమే, నత
మని నమ్మ కీవు మనసా హరి... 11

చ. తరువులు కొమ్మలుజ విరులుఁ దద్దయుఁ బూచి

యడంగునట్లుగా, సిరు లిల వచ్చుచుం జనుచుఁ
జిక్కులు బెట్టెడి నట్టిదానికే, పరులను వేఁడు
చుం దిరిగి ప్రాయము రిత్తయొనర్చి వెన్కవా,
చఱచిన లేదు ముక్తి మనసా హరి... 12

చ. పరుసము సోఁకఁగా నినుము భాసురకాంచనమై
నభంగి శ్రీ, హరిపదసేవచే భవభయంబు లడంగి
వినిష్కలంక వశా, పరమపదంబు గల్గు నని
పాయక కొల్చి తరించి రార్యులా, సరణిని భ
క్తి గల్గి మనసా హరి... 13

ఉ. పెట్టనికోట ఘోరభవభీరులకుం బరమార్థదేహి
కిం, గట్టనియిల్లు పూర్వకృతకర్మలతల్ దెగఁగోసి
వేయఁ జే, పట్టనిమేలివాలునొకపట్టుదలంపఁగ
మోక్షసంపదల్, అట్టె కొనంగవచ్చు మనసా
హరి... 14

చ. అఖిలతజపోపవాసనిగమాగమసంస్తుతికంటె నిత్య
సం, యమనియమాదియోగవిహితాచరణంబు
లకంటె సాధుసం, గమముఖదానధర్మములకంటె
మహోత్తమసౌఖ్యభాగధే, యము లనుచుం
దలంచి మనసా హరి... 15

చ. సిరివిగ రేవెలుంగుదొరవెన్నెలల న్నెల వచ్చు
చుం జనుఁ, గరులుహరుల్ సిరుల్ విరులు కామి

నులుఁ నిజదేహ గేహముల్, స్థిరములుగావు
వానిభ్రమఁ జెంది తుదిం జెడిపోవ కిప్పుడే, యఱ
మర లేక నీవు మనసా హరి... 16

చ. పుడమిని నీరుబుగ్గ చెడిపోయెడి నంచు జడుండు
లోహపుం, గడియము వేయఁబూనుగతిగా నిజ
దేహము నిల్వఁ గోరి యా, గడమునఁ బ్రాణ
రోధమునఁ గాంచు యొనర్పరు యోగులెప్పుడా,
సడి విడనాడి నీవు మనసా హరి... 17

చ. తనుఁ జెనుబాము పట్టుకొనఁ దద్వదనంబుననుం
డి యీఁగలం, గని తిన నేఁగుకప్పగతిఁ గాల
భుజంగము తన్ను మ్రింగఁగా, ఘనవిషయాళిఁ
గోరెడుజగం బిది నిత్యము కాని దంచు నీ, వని
శముఁ గాంచి నేఁడు మనసా హరి... 18

చ. నిరుపమపద్మపత్త్రమున నీరము లంటకనుండుమా
డ్కిఁ గు, మ్మరపురు వొందు నంటనిక్రమంబున
బూడిద గప్పుకొయనుఁ, దొరయనిరీతి నాత్మ
విదు దుర్భవబంధము లంట వండ్రు నీ,వరసినితాం
తభక్తి మనసా హరి... 19

ఉ. ఎక్కడియర్థచింతనము లెక్కడిసంగ్రహణైకసా
ధనం, బెక్కడిరక్షణక్షమత లెక్కడిహామ్ము మ
తాభిమానముల్, కక్కస మింత యేల యొ-

కకార్యము దెల్పెద నిత్యసౌఖ్యముం, జక్కఁగణిం
పు నీవు మనసా హరి... 20

చ. మనుజుఁ డపథ్యవస్తువుల మానక కొన్న నజీర్ణ
బాధ నం, జననమునొందునంచు మది సంశయ
మొందెడుఁగాని దుర్భవం, బనియెడు పెద్దరోగ
మున కాత్మ దలంకఁడ హో విచిత్ర మా, యను
వుఁ దలంచి నీవు మనసా హరి... 21

చ. విటులవృథాభిలాషలను వేడుక దెల్పుచుఁ జిత్త
మర్థసం, ఘటనమునందుఁ జేర్చుగణికానతిరీతిని
లౌకికక్రియా, పటిమను సర్వకార్యముల పారము
దంబున నిర్వహింపుచుఁ, జటులత నాత్మబోధ
మనసా హరి... 22

చ. సకమల వేదశాస్త్రము లసంఖ్యలు నేర్చి తదంత
రార్థస, త్పద మెఱుఁగంగలేనియెడఁ బ్రాణము
వాసి పునశ్శరీరివై, యుదయమునొంది యాచదు
వులొప్పఁగ నీకుఁ బఠింపఁ గష్టమా, నది యుదియం
చునేఁడు మనసా హరి... 23

చ. ఇలఁ గలప్రాణికోటులకు నెక్కుడు మానవులందు
విప్రుల, త్యలఘులు వారికంటె నిగమార్థవిదుల్
ఘను లట్టివారిలో, జలరుహనాభుపాదజలజా
శ్చకు లుత్తము లండ్రు గాన ని, శ్చలమున భ
క్తిగల్గి మనసా హరి... 24

చ. తొలుతను మాతృగర్భమునఁ దోఁచినతత్త్వవి
చారబుద్ధినే, యలయక చేసి యెల్లవిషయంబుల
రోసి నిజాత్మశత్రులం, దొలఁగఁగఁ ద్రోసి దుర్భవ
ము తూలఁగ మోక్షపదంబు జేరి యిం,పలర సు
ఖించెదీవు మనసా హరి... 25

చ. నిలయము కాలఁగా జడుఁడు నీటికి నై యిలు
ద్రవ్వినట్లు నీ, విల నవసానవేళఁ బరమేశ్వరుఁ
గొల్చి తరింతు నంచు నా,సలఁబడ నేల నేఁడె హరి
సర్వశరణ్య రమేశ పాహి మాం, జలజదళాక్ష
యంచు మనసా హరి... 26

ఉ. అద్దమున న్మనుష్యుఁడు నిజాస్యముఁ దాఁ గనుఁ
గొన్నమాడ్కి లో,నిద్ధపుదృష్టిఁ జూడఁగ విని
ర్మలబ్రహ్మము గానవచ్చు దా, నెద్దియు బొంద
కుండు జగమెల్లను తా నయి వెల్గుచుండునీ,
వద్దరిఁ గాంచఁ గల్గు మనసా హరి... 27

చ. ఇటు నటు పాలుద్రావి పరువెత్తుటకంటెను ని
ల్చి నీరు గ్రోలుట కడు మేలు మే లనెడులోక
హితోక్తిగణించి చాల మి, క్కుటమగుకర్మబం
ధముల గాసిల కచ్యుతుఁ జేరు మంటి వే, నట
బడకింక నైన మనసా హరి... 28

ఉ. ఏనుఁగు నెక్కి దొడ్డి జొర నేల తలంచితివే జ

గత్రయా, నూనపదక్రమోద్యత మహోజ్జ్వల
విక్రమకేళికామసం, థాను జగద్విథాను ఫణి
తల్పశయానుని౯ గొల్చి యస్యవాం, ఛానుభవం
బి౯కేల మనసా హరి... 29

చ. సకలచరాచరావనవిచారుని దివ్యపదాబ్జసేవచేఁ
బ్రకటితమోక్షసంపదలు బాటిలుటాత్మ నెఱింగి
సీదుబూ, టకములు బుగ్గిగాను అకటా వికటం
పుశిఖండివృత్తిరో, యక నెలకొంటివేల మనసా
హరి... 30

చ. గురుతుగ నేటియొడ్డు తెగి కూలెడువృక్షము
భంగి దేహ మీ, ధరణిని౯ గూలునేడనో య
థావిధి నేఁడొనరించఁజూచె దీవరయక చన్నవా
రినిధ్రువంబుగఁ జూడఁగలేవో కాలని, స్మరణము
సేయనేల మనసా హరి... 31

ఉ. ఇచ్చె ధ్రువంబుగా ధ్రువున కెన్న మహోన్న
తలోకపాలనం, బిచ్చె విభీషణాదులకహీనసుఖా
స్పదరాజ్యభోగ మం, బిచ్చె పరార్థముక౯ శబరి
కిచ్చెఁ గుచేలున కిష్టసంపదల్,సచ్చరితుం డతండు
మనసా హరి... 32

చ. పరసతిఁ గోరి కీచకుఁడు ప్రాణముఁ బాసె పరా
స్త్రకాదియై,దురమునఁగార్తవీర్యుఁ డతిదుర్బలుఁ

డై పడె నన్యవస్తు వ్యాపరమునఁ గోరి మున్ను
శతధన్వుఁడు కూలెనటందు రార్యులా, సరణినిఁ
గోరఁబోక మనసా హరి... 33

చ. నలువ లొసంగి వాయకుఁడు వాసిగ లేప మొ
సంగి కుబ్జ దా, నలరు లొసంగి మాలికుఁడునన్న
మొసంగి భరాసురాంగనల్, ఫలము లొసంగి
యాశబరి పాయనిసద్గతిఁ గాంచి రట్లు పొం, పల
రఁగ సేవఁ జేసి మనసా హరి... 34

ఉ. కన్నులు లేనివాఁ డడవిఁ గాడ్పడి పంగునిఁ ద్రో
పఁ జూపఁ గై, కొన్న కెఱుంగునట్ల జడతఁ గోరి
పరేతరు లైనవారి నీ,వెన్నిక జేసి కొల్వ ఫలమే
మిఁక మాటలు వేయునేల త,త్సన్నిధిఁ జేరవ
చ్చు మనసా హరి... 35

చ. పతిని నహల్య పాసి సురపాలునిఁ బొంది దురం
తపాపనం, గతినొకఱాయియయ్యె వ్రజకాంత
లుకాంతులఁ బాసి భ్రాంతలై, సతతము శౌరితో
రతులు సల్పి మనోరథసిద్ధిఁ గాంచి రా,చతురతఁ
గాంచి నీవు మనసా హరి... 36

ఉ. కన్నవుదొంగ వాక్కు మది కాయము లేశము
జేసి యర్థసం, పన్నతఁ గాంచు నవ్విధము బల్విడి
నారని పొంచియుంచినో,ళ్ళైన్నత మాపదార్థము

ను నొప్పుగ జేకొనవచ్చు మృత్యువా, సన్నము
గాకమున్నె మనసా హరి... 37

చ. వృకదనుజుండు శంకరుని వేదనఁ బెట్టఁగ వేగ
వచ్చియా, వికలత మాన్చి ప్రోచె సురవిద్విషు
లామధుకైటభాదు లో, ర్వక యలయింప బ్రహ్మ
ను సుకతీతుఁ జేసినదేవు గొల్వఁ దోఁ, చక
చెడనేల నీవు మనసా హరి... 38

చ. తననిజనాథుని న్వదలి తప్పక దర్పకుబారి గొఱ్ఱె
యై, కనుఁగొని జారులం గలసి కామిని దుష్క
ళత్రమైనభంగినిక్, వనరుహనాభుని న్వదలి వారక
యన్యులఁ గోరుచుక్ దురాశను బడనేల నీవు
మనసా హరి... 39

చ. కనికని నూతిలోఁ బడెడికష్టునికైవడి ఘోర
దుర్భవం, బునఁ బడి చచ్చుచుక్ మఱలఁ బుట్టు
చు నాత్మసుఖోపభోగతక్, మనుకు వపేక్ష చేసి
పలుమాఱును వేదనఁ బొంద నేల యొ,య్యన
దరిజేరవచ్చు మనసా హరి... 40

చ. అమరనదిక్ సరస్వతి మహాంబుధి నర్మదఁ గృష్ణ
వేణి గౌ, తమి యమునక్ సువర్ణముఖి ద్వార
వతిం బదరిక్ గయా ప్రయా,గములను గ్రుంకఁ
గల్గుగతిఁ గాంచును శ్రీహరినామ మొక్కమా,
టమరఁగఁ బల్కనేని మనసా హరి... 41

ఉ. వెన్న కరంబునం గలుగ వెత్తిగ నేతికి నేగినట్లు లో,నన్నెలకొన్న వెన్నుని గనంగ నపేక్ష యొకింతలేక యా,పన్నత నన్యులం గొలిచి పందలఁగూడక జ్ఞానదృష్టి భా,స్వన్నలినాక్షుఁ గోరి మనసా హరి... 42

ఉ. బూరుగుమ్రాను గాంచి భ్రమఁబొంది నశించుశుకంబుమాడ్కి సం,సార మపార మంచుఁ గనఁజాలక నీచులఁ గోరి కొల్చి నే,నూఱక మోసపోయి తయారొ యని నంతల నొందనేల వే,సాకముం దెఱింగి మనసా హరి... 43

చ. మొదలను గర్భవేదనల మూర్ఛిలుదుఃఖముపుట్టి భూమిపై, మొదలఁగ బాల్యదుఃఖ మటమీఁద వయస్సున కామదుఃఖ మ,య్యదనున సంసృతింబొరలు నంతట మృత్యువుచేత దుఃఖమౌ, నదిదలపోసి చూచి మనసా హరి... 44

ఉ. ఎందఱు దేవతల్ చనిరొ యెందఱు తాపసులట్టె భ్రష్టులై, యెందఱు రాజు లేగిరొ మఱెందఱు యోగులు జోగులై రొగో,యిందునిపాదపద్మములు వీడనిభక్తి భజింప నేరకా, చందము నొందకీవు మనసా హరి... 45

ఉ. గోవు లనేకవర్ణములఁ గ్రమ్మఁ బా లొకటైన

సంగి నా, నావిధభూషణంబుల ఘనస్థితి గాం
చుకొడానిమాడ్కి లో, కావళిలోనఁ బాసను
ననాకృతి లోకము లయ్యు నంతరా, త్మావహుఁ
డచ్యుతుండు మనసా హరి... 46

చ. తురఁగవు నక్షరుండవు ననంగివి శ్రీమహిళాను
షంగి వే, శ్వరుఁడవు సత్తపోనిధివి శాంతుఁడ
వుగ్ర భయదోగ్రకృష్ణ కే,సరివి భవన్మహత్త్వము
నిజమ్ముగ నెవ్వరికేనిఁ గాంచఁగా, నరుదుగఁ
దోఁచు నంచు మనసా హరి... 47

చ. శ్రుతముగ బుద్ధ్యహంకరణచిత్తములార వినుం
డు మీకు నే,హితముగఁ జెప్పెదన్ మన కధీశుఁ
డు నల్వుర కాదిమూల మ,చ్యుతుఁ డతిమాయ
నుం డతనిసొంపుగఁ బట్టెదఁ దోడుగండు మీ,
కతిసుఖ మబ్బు నంచు మనసా హరి... 48

చ. శరమున నొంచినన్ బగవశమ్మునఁ గొట్టినఱోలఁ
గట్టినన్, దఱిపులఁ గావ బంపినను దప్పక వాఁ
కిటఁ గాపువెట్టినన్, మఱువక ప్రోచువానినిను
మంచిగ వేఁడిన నన్ను బ్రోతువే, సరిసరి యంచుఁ
గూర్మి మనసా హరి... 49

ఉ. భక్తినిఁ గొల్వలేఁడు సదుపాయ మెఱుంగని
వాఁడు సంతతా,సక్తిని నేఁడు వీఁడు నను సారె

ను దూఱుచు వేఁడినాఁ డభి, వ్యక్తుఁ డటం
చు నెంచక యవారిత మౌదయ నన్నుఁ బ్రోవను
వ్యక్తుఁడ నీవ యంచు మనసా హరి... 50

ఉ. నేరము లెన్న నేల కరుణింపుము నే నిను వెం
బడించి వే,సారుచు వేఁడినఁ గానఁ వప్పు సామి యొ
కానొక వేళనైననా, కోరికదీఱఁ గన్పడవు కూరిమిఁ
జేయ నిఁ కేమి సేతు న, యాగ్ని నఘువరక్షి
ఝుంచు మనసా హరి... 51

చ, సరసిజనాభవాఙ్మయరసంఘము లాత్మల నీమహ
త్త్వముఁ, దరి గననేర రట్టినినుఁ దప్పక గొల్చి
తరించువార మం,చరయసుధాబ్ధి రేణుగణ మచ్చు
టఁ గ్రోలవె యేనుఁగీఁగ లా,పరణి నటంచు
నెంచి మనసా హరి.... 52

ఉ. చక్కనివాఁడు సర్వగుణసంపదలుం గలవాఁడు
భక్తిచేఁ, జిక్కెడువాఁడు లోకములచిక్కెడ
లించెడువాఁడు దీనులఁ, మిక్కిలిఁ బ్రోచువాఁ
డు కననేర్చినఁ గన్పడువాఁడు గాన నీ, వక్కజ
పాటుతోడ మనసా హరి... 53

ఉ. వేఁడెద నిన్ను నీడకయె వేదవలఁ గృశియించి
నాఁడ నీ,వాఁడ నెపమ్ము లెన్ని నను వంచనఁ జేసి
తివేని నింక ది,క్కెడ దయాపయోధి వని యెన్ని

తి నాదుమొఱాలకించు మె, గ్గాడకు మంచు
మ్రొక్కె మనసా హరి... ౕ౫

చ. అతులితశర్మిచర్యల గృహస్థమనీషలఁగానసాంత
రస్థితమితవృత్తులం గతివిశేషవిధంబుల ముక్తిగల్గు
నే, వితతదయాపయోధి యగువిష్ణునిఁ గోరి భ
జించువారి కా,యతముగఁ గల్గినట్లు మనసాహరి.

ఉ. తమ్ములమీరుసోరుకనుదమ్ములు ఖోమునిఁ గేరు
మోముకుం,దమ్ములచాలుఁబోలురదనమ్ములు నద్ద
ఫుమేను పద్మరా,గమ్ములడాలు నేలుపదకంజము
లుం గలతమ్మికంటి సౌ,ఖ్యమ్ము లొసంగు నీకు
మనసా హరి... 56

చ. గరళముఁబ్రామి చన్గుడుపు కామిని కిచ్చెను మోక్ష
మాసభాంతరమున నెగ్గులాడినఁబదంపడి వానికి
నైక్య మిచ్చె భీ,కరగతిఁ బట్టి మ్రింగుభుజగంబున
కిచ్చెను మర్త్యరూప మూ,చరితము లెన్నఁగల్గు
మనసా హరి... 57

ఉ. హెచ్చుగుగట్టుమోసి యలయింపక ప్రాణులఁ
బ్రోచినాఁడుతా,నిచ్చనుగొల్చుపాండవుల కేర్పడ
రాజ్య మొసంగినాఁడు కా,ర్చిచ్చును బట్టి మ్రింగి
నిజసేవకులన్ బ్రతికించినాఁడు నీ వచ్చపుభక్తి
గల్గి మనసా హరి... 58

ఉ. ఎన్నిక సంపదల్గలిగి యెగ్గని చూడక గొల్లయిండ్లలో, వెన్నయు జున్ను పాల్పెరుగు వేమఱు దొంగిలితిన్న చిన్నినీ, చిన్నెల నెన్న జోద్యముగఁ జెల్వుగ నీవిట రాఁగదన్న మా, యన్న యిదేమి యంచు మనసా హరి... 59

ఉ. నందునిమందయందు వ్రజనందనులందఱుఁ గొల్వ గోపికా, బృందవిపంచికారవము లింపొనరింపఁగ సుందరాకృతిం, జెంది కళిందజాతటము చెంతను తాండవకేళి సల్పునీ, చందము లెంతు నంచు మనసా హరి... 60

చ. ఎఱుఁగవు ముక్తిమార్గ మిది యొక్కఁడికర్మము దాఁపురించెఁ జే, టెఱుఁగనిబొట్టె తా మగని కింపుగ బెండ్లి యొనర్చినట్లు దుష్కర మగుకామ్యకర్మములఁ గాలము బుచ్చెదవేల బాపురే, సరసముగాదు నీకు మనసా హరి... 61

చ. పరుసము లాడఁబోకు పరభామలఁ గోరకు దుష్టవృత్తిచేఁ, దిరుగకు యాచకావలినిఁ దిట్టకు రచ్చలపక్షపాతముల్, నెఱపకు సాధుసంఘముల నిందలొనర్పకు కామమోహమత్సరముల జెంద కీవు మనసా హరి... 62

చ. పోలువుగఁ గోటివిద్యలును బొట్టకుఁ బట్టెఁడు

కూటికే కదా, యిలనుజయించి పెంపుగనున్న
టికైనను గాటికే గదా, కలిమి నిజం బటంచుఁ
గడఁగానక నిక్కెద వాయు రర్థముల్, జలముల
మీఁదివ్రాఁత మనసా హరి... 63

ఉ. కూరిమితోడ నైనఁ దగుకోరిక నైనను ప్రాణభీతి
చే,దూఱుటనైన వైరమునఁ దూఁగుచు నైనను
భక్తి నైనవే,మాఱు హరిం దలంప ననమానసు
ఖంబు ఘటిల్లుఁ గాన వే,సారక నీవు నేఁడు
మనసా హరి... 64

ఉ. కోఁతుల నేలినాఁడ వని కోవిదు లెన్నఁగ వింటి
నేనయో, కోఁతిగ నుంటి న స్నటుల గొబ్బున
నేవకుఁగా నొనర్చి సం,ప్రీతిగఁ బ్రోవు మంటి నిరు
పేదలఁ బ్రోదిగ సాఁకుటల్లఁబ్ర,ఖ్యాతియ కాదె
యంచు మనసా హరి... 65

చ. ఉదుతకుఁ గల్గె ముక్తిపద మూసరవెల్లికి సౌఖ్య
మబ్బె నె,క్కుడుగతి పక్షికబ్బె ధరఁ గోమలిరూ
పముఁ జెందెఁ దాయి మేల్,నడసెను పాయకుండు
భవబాధలఁ బాసె నిషాదుఁ డామహా, జడధిశ
యానునాజ్ఞ మనసా హరి... 66

ఉ. ఇల్లని నూతిలోఁ బడితి యేదరిఁగానక తల్లడిల్లినా,
తల్లివి తండ్రి వీవ యని తప్పక నన్ దరిఁజేర్చు

మంటినీ, వెల్లజగంబు లేలుకొనునేలికవై ననుబ్రో
వకున్న నేవల్లరిఁ జేతు నంచు మనసా హరి...

ఉ. నీసతి యిచ్చు భాగ్యములు నీసుతుఁ డిచ్చుఁ జిరా
యుసంపదల్, నీసుత జేయు పావనము నీవు జగం
బులఁ బ్రోతువౌ భళీ, నీసరిదైవము ల్గలరె నిన్ను
భజించినవారి కేటి దా, యాస మటంచు నీవు మ
నసా హరి... 68

చ గరుడునిమూఁపున న్నిలిచి ఖడ్గశరాసనశంఖచక్ర
ముల్, కరముల నుల్లసిల్ల మృదుకాంచనచేలము
కాంతులీన నుం, వరమణిభూషణావళు లుదారకి
రీటముఁ దాల్చి వచ్చి నీ, సరసను నిల్చి ప్రోచు
మనసా హరి... 69

ఉ. దాఁకొని జన్మకర్మపరితాపములం గృశియించి ది
క్కు నీ, వే కరుణింపవే మనుపవే యని వేఁడిలి
నన్ను బ్రోవవే, యాఁకటిబాధ చేఁ దనయుఁ డన్న
ముఁ దెమ్మనిపోరు చేసినన్, సాఁకదె తల్లియంచు
మనసా హరి... 70

చ. భవదుదరప్రభూతమగుపద్మభవాండమునం దనే
కజం, తువు లుదయింపఁ జేసి కృపతోడను బ్రోవ
ననేకభంగులన్, భువిజనియించు విశ్వపు పూర్ణుని
నిత్యుని నిన్నుఁ గూర్చి నం, స్తవ మొనరింతు నం
చు మనసా హరి... 71

ఉ. ఆఁకొని సత్త్వముం దొఱఁగి యట్టిటుఁ గ్రుమ్మరలేఁ
క కాలమం, దాఁకొని కుంభికుంభపిశితస్పృహఁ బీడని
గంధసింధురా, నేకపవైరిమాడ్కిఁ గను నేవ్యాపసం
సరణానుబద్ధుఁ డై, యాకమలాత్ముఁ గోరు మనసా
హరి... 72

ఉ. పాక్కిటఁ దమ్మిలో నలుస పుట్టువుఁ గూర్చినవాఁ
డు ఫాలపం, దెక్కుడుకంటి వేల్పు జనియింపఁ
గఁ జేసి యాతండు దాల్పఁ బెం, పెక్కిన మెట్టు
కమ్మిఁ జెదలేటిబిపథూటినిఁ గన్నమేటి సీ, యక్క
ఱ లెల్ల దీర్చు మనసా హరి... 73

చ. పలను పృగంబు నోదమున వారణ ముచ్చున
నంబుజంబు భూ, తలమునఁ జిక్కిన ట్లనితరస్థితి
నిర్మలభక్తిసూత్రధా, రుల కనువొంద లభ్యుఁ
డగు రూఢిగ నీశ్వరుఁ డంచు నెప్పుడొ, జ్జలు
పరికింతు రట్టి మనసా హరి.... 74

చ. సలలితశంఖచక్రజలజాభయహస్తము లొప్పువా
ని ను, జ్జ్వలదురురత్నకీలితసువర్ణకిరీటశిరంబు
వానిఁ గొ, మలతులసీవిభాసురమాయుతవ
క్షమువాని. గొల్చినం, జలనము లేనిముక్తి మన
సా హరి... 75

చ. హరచతురాస్యషణ్ముఖ సహస్రము ఖేభముఖాది

దేవతా, వరులు సమస్తవేదములు వర్ణన సేయఁ
గ లేరు ని న్నరయో, నరుఁడను జ్ఞానహీనుఁడను
నాథుఁడ వెన్నఁగ నాకు శక్యమే, శరధిశయాన
యంచు మనసా హరి... 76

ఉ. పాపము లెల్లఁ దీఱు భవబాధలు గొందులఁదూ
ఱు ఘోరసం, తాపదవాగ్ను లాఱు విపదంబు
ధులింకఁగఁబాఱు మోక్ష ము, ద్దీపితవృత్తిఁదేఱు
మనదీనత మాన్పెడివారు లేరు నీ, యాపద లె
ల్లఁ దీఱు మనసా హరి... 77

చ. తిరుమలలోఁ బ్రఖ్యాతవిధిఁ దీఱిచి సెలగిరిఁ భు
జించి కే, సరిగిరిఁ జందనం బలఁది చల్లనిదాహ
ము మంగళాద్రిలో,గురురుచిఁ ద్రావి రంగపురిఁ
గోమలితోఁ బవళించినట్టియా, పరసుని జేరె
దెవ్రు మనసా హరి... 78

ఉ. శ్రీకరముల్ సుధీజనవశీకరముల్ రిపులోకభేద
ద, ర్వీకరముల్ శ్రుతిప్రకరవేద్యాలసత్పరతత్త్వ
నిత్యాల, శ్మీకరముల్ సతీపతి శచీపతి వాక్పతి
సౌభాగ్యభోగ్యభా, గ్యాకరముల్ దలంప మన
సా హరి... 79

చ. తొలిచదువుల్వడింగొనుచుఁ దోయధిఁజొచ్చిన
సోమకాసురుఁ, బలిమిగ మీనరూపమునఁ బట్టి

వధించి రయంబునన్ శ్రుతుల్, నలువ కొసంగి
లోకముల నర్మిలి బ్రోచిన మత్స్యమూర్తిషాం,
పలరఁగ నిన్నుఁ బ్రోచు మనసా హరి... 80

చ. కులగిరి కవ్వ మంబునిధి కుంభము పాములత్రాఁ
డు త్రాడుగాఁ, దలపడి దేవదానవులు తత్పర
తన్ మథియింప భార మ, గ్గలమయి క్రుంగు
శైలము సుఖస్థితిఁ దాల్చిన కూర్మమూర్తి ని,
శ్చలముగ నిన్నుఁ బ్రోచు మనసా హరి... 81

ఉ. పుత్తడికంటిరక్కసుఁడు బొత్తిగ నీధరఁ జాఁప
జుట్టిన, ట్లెత్తుక తా రసాతలికి నేఁగఁగ వాని
వరాహరూప మై, కుత్తుకఁ ద్రుంచి భూతలముఁ
గొమ్మునఁ దాల్చినదంష్ట్రి సత్కృపా, యత్తత ని
న్నుఁ బ్రోచు మనసా హరి... 82

ఉ. సర్వమయుండు విష్ణుఁ డని చాఁటిన యాపసిబా
లుఁ గావఁగా, శర్వముఖామరు లొగ్గడ స్తం
భమునన్ బ్రభవించి నిష్ఠురా, ఖర్వనఖాలి దా
నవుని గర్భము జీరిన శ్రీనృసింహుఁడే, సర్వఫ
లంబు లిచ్చు మనసా హరి... 83

చ. బలి బలిమిన్ దివౌకసులఁ బాఱఁగఁదోల జగం
బు లెల్ల రం, జిలుపటువేష మూని బలిఁ జేరి
పదత్రయభూమిదానమున్, వలనుగ వేఁడి తత్ప

దవి వజ్రి కోసంగినయా త్రివిక్రముం, డలయక
నిన్నుఁ బ్రోచు మనసా హరి... 84

చ. ఇరువదియొక్కసయ్యములనిట్టులఁ గంటకులైన
రాజులన్, దఱలఁగఁ గూల్చి తద్రుధిరధారల
నేలు లోనర్చి పైతృకా, చరణము సల్పి శాశ్వ
తయశస్కరుఁడౌ భృగురామమూర్తి ని, న్నరసి
కృతార్థుఁ జేయు మనసా హరి... 85

చ. రవికులమందుఁ బుట్టి బలుసక్కసి తాటకఁ గొ
ట్టి మౌనిరా, ట్సవనము చక్కఁ బెట్టి గురుసప్న
తిఁ గావను ముట్టి వార్ధి దోర్జవమునఁ గట్టి రా
వణు ధరం బడఁ గొట్టినరామమూర్తి ని, న్నవి
రళలీల నేలు మనసా హరి... 86

చ. జలవసుదేవరోహిణుల కద్భుతలీల జనించి మిం
చె చే, హలముసలాస్త్రశస్త్రముఖరాయుధముల్
ధరియించి ముష్టికా, దుల వధియించి భూభర
ముఁదీర్చిన శ్రీబలరామమూర్తి తా, సలలితలీల
నేలు మనసా హరి... 87

చ. ఘనతరబోధలం ద్రిపురకాంతలనిష్ఠలు మాన్పి
పార్వతీ, శునకు శతాంగశస్త్రశరశూలధనుః
ప్రముఖోగ్రదివ్యసా, ధనములొసంగియున్ ద్రి

పురదైత్యులఁద్రుంచినబౌద్ధమూర్తి వి,న్న నవరతం
బుఁ బ్రోచు మనసా హరి... ౮౮

ఉ. మిత్రులమంచు దేవత లమేయసుఖస్థితి నిల్చి
యుండఁగా, శత్రులమంచు రాక్షసులు సంగర
భూములయందుఁ జావఁగా, శత్రులు మిత్రులుం
గలరె సర్వసముం డురగేంద్రశాయి త,చ్ఛాత్ర
నిఁ జేయు మంచు మనసా హరి... ౮౯

చ. తెలియక పాపకర్మములఁ దెంపునఁ జేసితి మంద
బుద్ధినై, మెలఁగితి కాలుఁ డేమిమిడి మేల మొన
ర్చునో యంచు భీతిచే, నిలిచితి నాకు దిక్క
నుచు నీవె మఱెవ్వరు లేరు బ్రోవవే, జలనిధిశా
యి యంచు మనసా హరి... ౯౦

చ. చిలుకకు రామరామ యని చెప్పినవేశ్య తరించె
ముద్దుచేఁ, దలపడి పుత్త్రుపే రిడుట ధన్యతఁ గాం
చె నజామిళుండు పే, రెలుఁగున బోయ చక్రి
స్మరియింప భవాంబుధి దాఁటె నట్లు ని,మ్ముఁలువ
తఁ గాంచె దీప్ర మనసా హరి... ౯౧

ఉ. గాలము మ్రింగినట్టిఝషకంబు తుదిం జెడిపోయి
నట్లు నీ, వేల భ్రమించి సంసరణహేయసుఖంబు
లఁగోరె దక్కటా, కాలుఁడు పోరఁజొచ్చెఁ

గడకాలము దాఁకొనవచ్చెఁగాన దోషాళి నడం
చి వేగ మనసా హరి... 92

చ. హరి భజియింతు నే నహరహంబు హరి స్మృతి
యింతు భక్తిచే, హరికి సపర్య సేతు హరి కం
జలు లిత్తు మనోహరంబుగా, హరి సరియైనదై
వత మజాండమున న్నహి యంచు నెంచ శ్రీ
హరిపురిఁ జేరవచ్చు మనసా హరి... 93

చ. బలిమిగ నూహలుజ్ఞ మిగుల ప్రౌఢి గలంగి చె
లంగి జీవితా, శలు దలపోయుమజ్ఞ వనలంజా
లక నంబుధిమధ్య మీనముం, బలె నిగళాంత
రాప్తిగతి బాధల నొంది కృశింప నేల నుజ్జ్వలత
రభక్తి గల్గి మనసా హరి... 94

చ. కరివరు నేలినాఁడు మునికాంతవిపద్దశ మాన్పి
నాఁడు ద, ర్భరశరవహ్నిఁ గ్రాఁగ నుదరస్థుని
బాలునిఁ బ్రోచినాఁడు త, త్తఱపడి వేఁడ త
త్క్షణమె ద్రౌపది మానము గాచినాఁడు ని, న్న
జమఱచేయఁబోఁడు మనసా హరి... 95

ఉ. తల్లికిఁ గల్గినట్టిదయ దాదికిఁ గల్గునె యెన్ని
చూడ నీ, చిల్లరవేల్పులు న్నెవరు జిక్కఁగ బ్రో
చుట కల్లగాదె నేఁ, జెల్ల జగత్కుటుంబి వెస

చేయక తొల్లిటివారియట్ల నే, యల్లనఁ బ్రోవు
మంచు మనసా హరి... 96

ఉ. ఊడుగవిత్తు లత్తరువు నొయ్యనఁ జేసినరీతి వా
హీనుల్, వీడక వార్ధిఁ జొచ్చిన ప్రవీణత నుత్త
మసాధ్వివల్లభుఁ, గూడఁగ నేఁగుమాడ్కి లత
కూనమహీజముఁబ్రాఁకినట్లు మా, రాడకఁ గోర్కు
లూర మనసా హరి... 97

ఉ. శ్రీదము లాశ్రితావనవిశేషవినోదము లాగ
మాంతస, మ్మోదము లబ్జజాద్యమరముఖ్యమనశిక
మలార్చనాంతరా, మ్లోదము లార్తరక్షణమహా
త్త్వపటుత్త్వసమస్తశిష్టక, ప్రొదములోఁ దలంప
మనసా హరి... 98

ఉ. ఏదయ నీదయాభిమత మెందుకు నావయి యా
దిరాదయా, నాదయ నీపదాశ్రయము నమ్మితి
దబ్బరమాట గాదయా, నీదయ నే నకించనుఁడ
నీవు ప్రపూర్ణుఁడ వంచు భక్తర,క్షా దయ బ్రోవు
మంచు మనసా హరి... 99

ఉ. పూర్వభవంబునందనరుపుణ్యగతిఁ లభియించి నీ
మహా, ఖర్వచరిత్రము ల్విదువఁ గల్గెను పెన్ని
ధిఁ గన్న పేదవాఁ, డుర్వి సుఖించినట్లు ముద

మొప్పఁ గృతార్థుఁడ నైతి నోవిహాం, గార్య ర
మేశ యంచు మనసా హరి... 100

ఉ. పాయక తాడెపల్లికులపావనుఁడై విలసిల్లు పాన
కాల్, రాయనిచేఁ బ్రణీత మయి రంజిలు మా
నసరాజయోగసం, ధాయకవంద్యసంస్తవశతం
బనిశంబుఁ బఠించి మోక్షసం, ధాయతఁ బొం
దెదీవు మనసా హరి... 101

ఉ. మంగళ మబ్జజాసహిత మన్మథకోటిస్వరూపసుం
దరా, మంగళ మార్యలోకహిత మంగళ మగ్ని
రవీందులోచనా, మంగళ మభ్రకేశనుత మంగళ
మాహవరంగభీమ దై, త్యాంగవిభంగయంచు
మనసా హరిపాదము లాశ్రయించుమా! 102

మా న స బో ధ శ త క ము
సం పూ ర్ణ ము.



# పీఠిక.

ఈచిత్తబోధశతకము, మానసబోధశతకము నొక్కఁడే రచించినట్లుఁ దోఁచుచున్నది. విషయమునందు రచనయందుఁ బదముల సారూప్యమునం దీరెండుశతకములందు సామ్యముండుటయేగాక వంశవృత్తము వెలుపుపద్యము మంగళపద్యము ఇంచుకమార్పులతో సమముగా నున్నవి. కాని చిత్తబోధశతకము మానసబోధశతక మంత ప్రౌఢముగా నుండకపోవుటచే చిత్తబోధశతకము ప్రథమప్రయత్నమని యూహింప నవకాశము కలుగుచున్నది.

శతకము రచించినకవి తాడేపల్లి పానకాలరాయఁడు. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. మంగళగిరి పొన్నూరుక్షేత్రములను పలుమాఱు స్మరించుటబట్టియు శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యము వ్రాసెననుటబట్టియు నితరాధారములఁబట్టియుఁ గృష్ణాతీరమునందలి తాడేపల్లి నివాసియేమో యని నిర్ణయింప వచ్చును.

కవి యీశతకమును "సకలపురాణసంగ్రహ"మని చెప్పికొనినాఁడు. విశేషముగాఁ బద్యములలో విష్ణు మహిమానుభావమును దెలుపు పురాణాంశములే కలవు. ప్రతిపద్యము రసాస్వదమై సుబోధకమగు భక్తిరసమునఁ గాఁపట్టుగ నుంటచేఁ జదువుటకుఁ జవులూరుచుండె ననుటకు సందియము లేదు.

హృదయమునను ఐహికములనుండియు విషయాదులనుండియు మఱలించి భగవచ్చింతనమునకుఁ బురికొల్పునట్టి యీశతకము ముముక్షువులకుఁ దోడ్పడఁ గలదు. కవిజీవితము మానసబోధశతకమునఁ దెలుపఁబడియున్నది.

నందిగామ.<br>1-1-25

ఇట్లు, భాషాసేవకులు,<br>శేషాద్రి రమణకవులు.

# శ్రీరస్తు.

## తాడేపల్లి పానకాలరాయకృత

# చిత్తబోధశతకము

---

ఉ. శ్రీరమణీయవైభవవిశేషములై సనకాదియోగి
హృద్వ్యాప్తతరమ్ములై గగనశైవలినీజననప్రవర్ధనా
గారములై జగత్త్రితయగణ్యములై బుధలోక
జీవనాధారములైన శ్రీహరిపదమ్ములు కోరిభజిం
పు చిత్తమా. 1

చ. హల కులిశాంకుశ ధ్వజ శరాసన తోరణ శం
ఖ చక్ర కోమలజలజాత మత్స్య యవ మంజుల
రేఖల సుందరమ్ములై, జలజభవాభవాద్యమర
సంఘము సంతతభక్తియుక్తినో, దలల ధరించు
శ్రీహరి... 2

ఉ. నందసునందసేవిత సనందనవందితసుందరాంగ
గోవింద ముకుంద భాస్వదరవిందదళాంబక కం
దవర్ణ, శ్రీమందిర విశ్వతుంద ధృతమందర వం
దనమయ్య వేదవిద్వందిత యంచు శ్రీహరి...3

ఉ. తమ్ములు దమ్ములంచు విదితమ్ముగ లాలనసేయు
చుం బ్రవా, ళమ్ములడాలు డీలుపడులక్షణకాం

క్షుంబించి పద్మరాగమ్ముల ప్రస్తరమ్ములన గ్రమ్మిన
విమ్ములనొంచి హాల్లకార్థమ్ముఁబోలు శ్రీహరి...

శా. యమున సుకాళియోరగవిశాలఫణాంతరసీమఁ
జేరి దిం, ధిమికిటదింధిమింధిమిత తైయ్యని తాండవ
కేళిసల్పు నీ, యమలినకోమలాంఘ్రియుగము
ల్లనఁ జూపఁగదయ్య మ్రొక్కెదన్, దయఁగొని
యుందు శ్రీహరి... 5

ఉ. దండము పాండుతుండరథ దండము పాండవరా
జ్యదాయకా, దండము చండికేశనుత దండము
కంజభవాండ నాయకా, దండ మఖండతత్త్వమ
యా దండము కుండలిరాజతల్పకా, దండ మటంచు
శ్రీహరి... 6

ఉ. దేవ మహానుభావ వసుదేవతనూభవ వాసుదేవ
రా, జీవభవాదిదేవగణసేవిత మాధవ సర్వలోక
సం, భావిత నీగుణత్రయము బ్రస్తుతిఁజేసెద
నంచు నాత్మబో, ధావళవృత్తి శ్రీహరి... 7

చ. ఉరమున లక్ష్మి నాభినళినోద్భవుఁ డంగములందు
దేవతల్, కరముల శంఖచక్రములు కంఠమున
న్మణిహారకాంతులున్, శిరమున రాజరత్నరుచి
చిత్రకిరీటము గల్గువేల్పు సా, దరమునఁ బ్రోచు
శ్రీహరి... 8

నీఁ బాడుమింక సంశయము లేదు చూడు హరి
దీనులపాలిటివాఁడు సంతతో, ద్ధ్యానహాశ నేఁడు
శ్రీహరి... 13

చ. సిరులు చెలంగు లోనరిపుచేష్ట లణంగు మహో
గ్ర కాలకింకరభయము ల్దొలంగు సుకరమ్ముగ
సంసారలింపెసంగు దుస్తరభయము ల్దలంగువి
వరమ్ముగ ముక్తి గలుంగు కల్మషోత్కరములు
ద్రుంగు శ్రీహరి... 14

ఉ. పారెకుసారెకుజ్ఞ దనుజసంహరుదివ్యకథామృతం
బు వేసారక శ్రోలుచు స్వినుచు సంతత మ
చ్యుతదివ్యమంగళాకారము ధారణావశతఁ గ
ట్టిగనాత్మనుజేర్చి భక్తిబోధారతగల్గి శ్రీహరి...

చ. సిరుపము నిత్య నిర్విషయ నిర్గుణ నిష్కల నిర్వికల్ప
వి, ర్జర నిగమాంగ నిర్మమ నిరంజన నిశ్చల నిర్వి
కార నిస్పృహ నిరావలంబ నిరుపద్రవ నీసుగుణ
మ్ము లెంతు సత్వరముగ నంచు శ్రీహరి... 16

చ. బలి జన కాంబరీష ధ్రువ పార్థ విభీషణ భీష్మ
దాల్భ్య పిప్పల హనుమ త్పరాశర సుపర్ణగ
జేంద్ర వశిష్ఠ వత్సదేవల శుక నారదప్రముఖ
భాగవతోత్తములం దలంచినం దలఁగక మెచ్చు
శ్రీహరి... 17

చ. కరివరుదైన్యమున్ హారిణిగండము ద్రౌపది భంగ
ముత్తరో, దరశిశుబాధ కుబ్జమదితాపము విప్ర
సుపుత్త్రచింత భూ, భరము నృపాలకోటిచెఱ
బాపినదైవము నేఁడు నన్ను సత్వరముగఁ బ్రో
చు శ్రీహరి... 18

చ. కరివరునిన్ జలగ్రహము గట్టిగఁబట్టిన డస్సి వే
యిటు వత్సరములు కుయ్యిడంగ విని సర్వమయ
త్వము లేమి వేల్పుల్, వెఱఁగుపడంగ నచ్యుతుని
వేఁడిన నక్రము ద్రుంచి హస్తినా, వరమును బ్రో
చు శ్రీహరి... 19

చ. పలుబు నిషాదుఁడేసిన కఠినాస్త్రముఁ గృష్ణుఁ బ్ర
పాతివేదనన్, కళవళపాటుఁ జెందుచున్ హరిణకామిని
మోహవిమోహరమేశ్వరా, దయఁ బాపవే
యనుచు వేఁడ దయాళుకృష్ణమూర్తి నేఁ, బలుఁ
గఁ బ్రోచు శ్రీహరి... 20

చ. పసపడి కౌరవ్య సభకు బల్మిని ద్రౌపది నీడ్చి
తెచ్చి దు, ర్జనుఁడు వలువ లొల్వఁగ రమావర
నాదుకష్టముఁ బాపవే, యదునందనా వని యనంగ
నక్షయచేలము లిచ్చి ప్రోచు న, ద్భుతుఁడగు
నట్టి శ్రీహరి... 21

చ. తరలని ద్రౌణిబాణశిఖ దార్కొని యేఁచఁగఁదా

శబాలనో, మురహారకృష్ణ యోభువనమోహన
కావవె యంచు వేడ ను, త్తరజశరస్థబాలుని
ముదంబునఁ బ్రోచిన శౌరి నిన్ను న, త్వరముగ
నేలు శ్రీహరి.... 22

ఉ. కాముముఁ జెంది శూర్పణఖ కంసునిదాసిగఁ బుట్టి
కుబ్జయై, యామథురాపురిఁ మధుమర్దాంతకుఁ
బొంది హరించె నింక నీ, కేమిటి కీవిచార మేల రె
ట్టింపుగఁ గోరిన నట్లు ప్రోచు శ్రీ, ధాముఁడు గాన
శ్రీహరి... 23

చ. ధరణి కుశస్థలీపురనివాసుఁడు విప్రుఁడు పుత్త్రులీ
ల్గినఁ, నరుని ప్రతిజ్ఞ దూలెనని నందకుమారుని
వేడినంతనే, కరుణను ద త్తనూజశతకంబు సజీ
వముఁ జేసి తెచ్చి న, త్వరముగ నిచ్చె శ్రీహరి.

ఉ. ఆలముచందుఁ దోల్గి దెగటారిన దైత్యులు వ్వా
షసంబునం, దోలిఁ బ్రబంబ కంస నరకోరగ కారన
సాల్వ చేది భూ,పాలక దంతవక్త్రముర పౌండ్ర
కులఁ బడఁగూల్చెమాన్చె ను,త్తాలభరంబు శ్రీ.

చ. సురవరులం జయించి బలశోభితుఁడై నరకాసురుం
డు భూ, వరులను బట్టి యాఁకగొని వంచననే
యఁగ కావవె హరీ, శరణని వేడి వారి చెఱ

---

* లైనను ద్రుంచి.

చ. తలఁప నహల్యఁ దార కురుదార దశాననదార
ద్రౌపదీ, లలనను నమ్మహాత్ముఁడు విలాసయశః
పరిపూతగాత్ర లై, వెలయఁగఁ జేసినాఁ డనుచు
వింటివి సంశయ మెందుకింక నం,తలఁ బడనేల
శ్రీహరి... 31

చ. అడవుల నొక్కలుబ్ధకుఁ డహర్నిశలం పతిక్రూర
కృత్యముల్, నడుపుచు రామరామయని నర్మిలిఁ
బల్కుటచేతఁ బూతుఁడై, వడి జడదారియై
కడకు వాసిక నెక్కుట వింటి వివరంబో, తడఁబడ
నేల శ్రీహరి... 32

ఉ. నింగికి నేగి దైత్యుల ననిం దెగటార్చ సురాళి మె
చ్చిఖ, ట్వాంగుఁడుఁ వేఁడినట్టుఁ నిజాయువుఁ
జెల్ప నతండు ధాత్రి దీ, ర్ఘం గమలాక్షుసంస్మ
రణస్పృముహూర్తములోఁ దరించెఁ దద్భంగిని
నీవు శ్రీహరి... 33

ఉ. భూసురదాసిగర్భమునఁ బుట్టి సదా హరిభక్తిఁ
గొలచె, భూసురసత్తి నారదుఁడు బాగుగ దేవ
ఋషిత్వ మొంది నే, వాసురమర్త్యలోకముల
నందఱికి న్గురుఁ డయ్యెఁ గాన నీ, వాసి నటించు
శ్రీహరి... 34

ఉ. హేయపుబానిసెం గలసి హీనుఁ డజామిళభూ

సురుండు లేం, బ్రాయమునందు సంతుగని ప్రాణ
ముఁ బాసెడివేళఁ బుత్త్రునా, రాయణ యంచుఁ
బాముడువ నచ్యుతలోకముగల్గెఁ దత్కథా, ధ్యా
యుని యాచు శ్రీహరి... 35

చ. పరువడికోసలాత్మజయుఁ బంక్తిరథుం డరయంగ
దేవకీ, వసుదేవులై పొడమి వారిజనేత్రుని
గాంచి పెంచి ర, చ్చరితము లెంచి ఘోరభవసం
ఘముల న్నిరసించి ముక్తి స, త్త్వరగతిఁ గాంచి
శ్రీహరి... 36

ఉ. పాండుగద్రోణుఁ డన్వయవిభుండును భార్యధరా
భిధానయుక్, నందయశోదలై పొడమి నందను
గాం గని పెంచి ముక్తులై, రందరుగారె భావ
మెట్లులైనను రక్షకుం డండు నమ్మి రే, తం
దర లేక శ్రీహరి... 37

చ. అలర సుమిత్రరోహిణిసమాఖ్య వహించి జనిం
చి కాంతచే, హలధరుఁగాంచికాంచెనఖిలామరు
లందఁగలేనిసౌఖ్యముక్, దలఁగక తచ్చరిత్రము
యథావిధిగా నుడువంగ నీకుఁ బక్షపాతము గలుం
గు శ్రీహరి... 38

చ. నయమును బాసి పూతనయు నందునిమందిరమం
దువెన్నునిన్, దయమున నొంపఁబట్టఁగను రాజ

నందత్కుచ దుగ్ధరక్తముల్, ప్రియమునఁ గ్రోలి
కూల్చి దయపెంపున నైక్య మొసంగె నేమివిం,
తయొ తలపోసి శ్రీహరి... 39

చ. మదమునఁ గాలనేమి హనుమంతునిచే హతుఁ
డౌచు ద్వేషిగాఁ, బదపడి కంసుఁడై పొసఁగ పంక
జనాభునిఁ జేరె మాయురే! యదనున భక్తినైనఁ
బగనైనను బన్నగతల్పుఁ గొల్వ భద్రదమగుఁ
గాన శ్రీహరి... 40

ఉ. *భ్రాతృశిరోవిఖండనకృతంబున ద్రౌపదిగా నొ
నర్చి యా, నాతికిఁ దుష్టిఁ జేయఁగ రణస్థలి కౌరవసే
ననిచ్చి బల్, జాతరఁ జేసి రుద్రగణజాడ్యముఁ బా
పితి వెన హేఁజగ, త్రాత యటంచు శ్రీహరి...

చ. చతురతఁ గాధినందనుని జన్నము గాచె నహల్య
శాపమా, తతమునఁ బాపె రాజకులతన్వికి మో
క్షమొసంగె నత్యసం, చితముగ సర్వలోకములఁ
జేకొని యేలిన దేవదేవుఁ డు, ద్ధతినినుఁ బ్రోచు
శ్రీహరి... 42

ఉ. కోరిక దీఱ నొక్కపరి కోమలసౌరభపుష్పదామ
ముల్, గూరుప మాలికున్ననిచెఁ గొంగుపసిం

* ఈకథ పురాణాంతరములవలన దెలిసికొనవలయును.
శాంతాదులలో మృగ్యము.

య నేఁగఁగ లేవ్ర ముందునా, పరియెటు లంచు
శ్రీహరి... 47

చ. పారిపారి పైఁబడి పుష్పములను పూజలు చేసిన భూమి
పాలునిన్, విరివిగ మంటి పువ్వులను వేడ్కనో
సర్పశకుంభకారునిన్, సరసతమల్లెపూవుల నోసం
గిన భూసురవర్యునిన్ సుహా, సరమునఁ బ్రోచు
శ్రీహరి... 48

ఉ. పొందున మేనమామ తనపుత్త్రికనిచ్చె నటంచు
మాని గో, వింధునకీయకున్న వెనువెంటనె హా
టకగఁ గారినుండి వే, రోంపగ వచ్చి పెండ్లి నిగ
మోక్తుని పొన్నుఁరిలో నొనర్చి త, ద్వ్రందితుఁడైన
శ్రీహరి... 49

చ. విరిసరు లీయఁగైకొనుచు వింత నెఱుల్ పరుఁబం
దుఁగాంచి భూ,వరుఁ డలుగన్ దదర్చకుని వాక్య
ము నిక్కముగా శిరోజముల్, విరివిగఁ జూపి
యా చెడఁద వీడఁగఁ జేసెను మున్ను కాకుళాం
తరమున నట్టి శ్రీహరి... 50

ఉ. తేనె ఘృతంబు పాలు గడుతీర్థము నాల్గుయుగ
క్రమంబులం, దానును శంఖచక్రముఖ రాయుధ
ముల్ స్వకరాంబుజంబుల, న్బూనుచు సాధుసం

గములఁ బ్రోదిగ సాఁకుచు మంగళాచలాస్థాప
కుఁడైన శ్రీహరి... 51

ఉ. పొంగుచు వొక్కవిప్రకులపుంగవుఁ డంగజకేళి
వేల్పువా, రాంగన వీడిన వ్యగచుచంతటికి [illegible]
[illegible]నవేషధారివై, బంగరుగిన్నెఁ దా నొసఁగి
బాగుగఁ బ్రోచి [illegible]డాక్యవహ్ని, స్సంగతుఁ డౌ
చు శ్రీహరి... 52

ఉ. పాతకురాల నోపతితపావన నీమహనీయరూప
ముల్, ప్రీతిగఁ జూపుమంచు మొఱఁబెట్టఁగ నీల
ధరాధరంబునన్, ఖ్యాతిగఁ జేర్చి దాని గరికల్మ
షరాలిని జేసితౌ జగత్త్రాతవటంచు శ్రీహరి...

ఉ. కోరితి నీపదాబ్జము లకుంఠితభక్తిని బూజసే
యఁగాఁ, జేరితి నీమహోన్నతవిచిత్రచరిత్రము
లాలకింపఁగా, దూరతిఁ గావలెన్ దురితదూర
దయామృతదృష్టిఁ జూడు నా, జారితినంచు శ్రీ
హరి... 54

ఉ. నీగుణముల్ నుతింపఁగ ఫణీంద్రుఁడు చాలఁడు
నీచరిత్రము, ల్బాగుగఁ గాత్రపీఠ్యుఁ డొగివ్రా
యఁగనేరఁడు నీదుసాయగం, బాగిరిభేది నిక్క
ముగ నారయనోపఁ డజాండపాలనో, ద్భాగుడ
వంచు శ్రీహరి... 55

న్నని మన్ననసేయరాదె విద్వన్నుతయంచు
శ్రీహరి... 60

ఉ. మానసమా! వృథావిషయమగ్నత నంటఁగనేల
ప్రాకృతైక, కానక మేఁక మాత్రఁ బడుకై పడిఁ గన్న
దె నీ ప్రచారముల్, మానుము మాధవు
న్గొలుచు మంచిసుఖంబు ఘటిల్లుఁ గాన విద్యా
నయవృత్తి శ్రీహరి... 61

ఉ. ఉత్తమధర్మముల్ నడుపనోప వనుత్తమధర్మ
కర్మముల్, మొత్తముగానొనర్చెదవు మోసము
వచ్చు టెఱుంగవైతివే, యెత్తునమోక్షమందె
దవా! యెందుకు జాగిఁక నీదువృత్తితద్ధ్వత్తము
చేసి శ్రీహరి... 62

ఉ. ఎత్తఁగరానిజన్మముల నెన్నిటఁద్రోచితి వన్ని
యెత్తినేఁ, డుత్తలమంది కుంది యిపు డోరువఁ
జాలక నిన్నువేఁడ నన్నిత్తఱి నిర్నిమిత్తముగ
నేఁటికి యేఁచెదవయ్య మాన్పు నాత్తతలమంచు
శ్రీహరి... 63

ఉ. దాకొనుపుణ్యపాపములఁ దప్పక మానవలోక
మందు దుర్వ్యాకులవృత్తిఁ బుట్టి యపవర్గముఁ
గానక గోరుచుట్టుపై, రోఁకలిపట్టరీతి నెదరో
యక సంసృతిఁ జిక్కి యింక నెందాఁకఁ జరింతు
శ్రీహరి... 64

ఉ. ప్రాయము కాయముం సతమె భక్తిఁ బఠించిన
వారిఁ బ్రోవ నా, రాయణుఁడుం గదీయ మగు
రాజ్యము లుండఁగ ఘోరదుర్గతి, న్బాయక గూ
లు మానవుల బాధలు చూడ సహా విచిత్ర
మూ, దాయము లేదు శ్రీహరి... 65

ఉ. సర్వచక్రవర్తులు పసార్వరాజులు రాజ్య
మేలిరి, యుర్విగలంత కాల మిటులుండిరె నీబ్రతు
కెంతలోని దీపర్వ్యాలు పర్వనేల ముకభంజను
సేవయె ముక్తికర్యాకా, సర్వగ నెంచి శ్రీహరి.

ఉ. వేమరు మాధవున్దలఁపవే యని సఁచెవిఁజాటి
చెప్పఁగా, నేమలుపాటుఁజెంది వినవేమిపురా
కృతకర్మ మయ్యయో!, పామరవృత్తి మైమఱచి
బాముల కేయొడిగట్టుకొంటి వీ, తామసమేల
శ్రీహరి... 67

చ. ప్రకటితవేదశాస్త్రముల భాసిలుతత్త్వ మెఱుంగ
లేక యీ, వికటతమంబులం దగిలి వెక్కిరిచేష్టల
పిల్లిపిగుచుం, సకలము నాదె నే ననుచు సంసృ
తిఁ జిక్కి చరించువారితోఁ, బకబిక లేక శ్రీహరి.

ఉ. ఆతతముక్తిమార్గము నయం బుపదేశముఁ జేసిఁ
చూడఁగాఁ, గోఁతికి రత్నహారములు గొంకక
వేసినమాడ్కిఁ దోఁచె నీ, నీతికి నేమనందు

నీఁక నేర్పరివై భయభక్తితో మునివి, ధ్యాతము
లైన శ్రీహరి... 69

ఉ. నీరము వృక్షమూలమున నించినఁ జల్లఁదనంబు
కొమ్మలం, జేరినమాడ్కి విష్ణునకుఁ జేయుపచర్యల
సర్వదేవతల్, భూరితరేష్టభోగపరిపూర్ణతఁ గాం
తురు నీకుఁగల్గు వి,స్తారసుఖమ్ము శ్రీహరి... 70

చ. ఉరమునఁగల్గు రత్నరుచిరోజ్జ్వలహారము వెల్గె
వాఁడు దా, నరయఁగ లేనిమాడ్కి భవసంతమ
త్మనుగానవైతి వ,స్థిరముసుమీ యొకల్ తెలిపి
దెచ్చుక యింతటనైన భక్తిత,త్పరతఘటిల్లు శ్రీ
హరి.... 71

చ. పనుపడ లౌకికక్రియలు పాయక పల్కఁగవచ్చు
నంటివా, విను మొకనీతిదెల్పెదను విప్రగవా
మరభూతకోటికిన్, గానకాని మెగ్గునేయఁ యు
కుంఠితవృత్తిని జిడ్డు నాలుక,న్దనరనినీతి శ్రీహరి.

చ. కలఁగనిలేచి తద్విధము గానని కైవడి దైవ
మాయచేఁ,గలపడిదేహధారులయి తప్పదు మో
హముఁజెంది తత్త్వము,ల్దెలియక మోహపాశమై
గతిం జరియింపక మోక్షకాంక్షచేఁ, దలఁపు
వహించి శ్రీహరి... 73

చ. ఎన్నికఁజేసినన్నిటుల నెన్నివిధంబుల బోధఁజేసి

నన్, జన్మలరంగ హీనునకుఁ జేసినమేల్ చెడు
నట్లు గన్పడెన్, గన్నడఁబుద్ధిలోఁ గలపె కాలముఁ
దప్పక నింకనైన వి,ద్వన్నుతుఁ డైన శ్రీహరి.

ఉ. అంధతమంబులోపలఁ బదార్థగవేషణమెల్ల నైం
ధవ, గ్రంథి జలంబులో విడుటగావున నాత్మజ
నావనైకహృ,న్మంథుఁడుసంహృతోగ్రభవబంధుఁ
డు లౌకికగాథమానుమీ,దంధనలేల శ్రీహరి.

ఉ. జ్ఞానము మేళవించి మరుగాళ్లనటించు మనుష్యుఁ
డౌదల,న్బానినదొంతులన్ మఱవుఁ బొందనిడెం
దముభంగి సంసృతి, న్మానక సర్వకర్మము లమంద
ముగా నొనరించుచో సదా, ధ్యానముగల్గి శ్రీ
హరి... 76

ఉ. తరణినమస్కృతుల్ సలుపు ధన్యులఁగన్గొనివాన
రంబు ద,త్సరణినొనర్చుచందమున సాధుల సే
వనఁజేయుకొంతయున్, పరమపదాధినాథు పద
భక్తులఁగూడి విశిష్టవర్తివై, తరలనిభక్తి శ్రీహరి.

ఉ. బట్టలఁగొట్టిచిట్టెలుక పట్టెఁడుపొట్టకుఁ గాంచ
నట్టులి,ట్టట్టుమెలంగి మోక్షగతులారయనేరని
చెట్టనైతి నీ,వెట్టులగట్టుబట్టెదవొ ? వఁటికిబు
ట్టఁగ గిట్టఁగా నయో, దట్టపుభక్తి శ్రీహరి...

ఉ. తంతువునన్ గృహంబు బలితమ్ముగఁజేయుడు సం

దుఃజిక్కి తా, రెంతయు లేకబున్నివురు వేర్పడ
వంతమునొందినట్లు వి,భ్రాంతివహించి సంసృతివి
బాల్పడి గోల్పడ నేలకల్లయా, ధ్వాంతమణం
చు శ్రీహరి... 79

చ. చిరిగినచీరమాని మఱుచీరధరించినమాడ్కి మా
టికిఁ, బరివిగదేహమున్విడచి వేఱొకదేహము
లోనఁ జొచ్చు తాఁ, బరఁగనిమాయలోనఁబడి త
ల్లఁడపాటునఁ దన్నుఁ గానఁడుచుఁ, దరిఁగన వే
ల శ్రీహరి... 80

ఉ. కూపముగప్ప నేర్పునను గొబ్బునమాన్పడి చి
ల్వపోలికఁ, వేసటసేయు జన్మపరివేదన వీడు
నుపాయమార్గము, ల్గాపనమున స్థనుంగొనికలక్షు
ణపంతులఁ గూడి నిర్మలో, జ్ఞానుప్రవృత్తి
శ్రీహరి... 81

ఉ. అన్నము ధాత్రి యందమృతమాప్రలమందలయం
దుపావకం, బెన్నసమిత్తులందునరులేర్పడఁగాంచి
నభంగిబుద్ధిచేఁ, గ్రన్నన మోక్షము స్వాదయుఁగా
నగుఁగావున భక్తి చేత వి, ద్వన్నుతుఁడైన
శ్రీహరి... 82

చ. నిరతము నీరుపక్కియలు నీరములందుమునింగి
యీఁదు నే, గుఱుతుగ మేడిపండ్లఁ గ్రిమికోటు

లు పుట్టుచుండులోనఁజిక్కి నే, విరివిగ సంస్కృతిఁ బో
రలి వెల్వడుమార్గమెఱుంగవన్న నీ, తరమె
తరింప శ్రీహరి... 83

ఉ. మాయురె! కొందమా హరికి మార్పడియన్యుల
గొల్చుటందమా, పాయకగంగచేరువను బావి
యొనర్పఁగబూనుటందమా, కాయము నమ్మి కా
లగతి కానని చందమదేల ముక్తిసం, ధాయకుఁ
డైన శ్రీహరి... 84

ఉ. మిథ్య సుమీ జరామరణమేదురమైన యొడల్
దురంతశా, స్త్రార్థ్యయనమ్ములెల్లను మహాఫలద
మ్ములు కావుసుమ్మి యీ, మధ్యమలోక మింతటిది
మర్త్యకుమస్తదుదీరిత మ్మిదే, తథ్యము వేగ శ్రీ
హరి.... 85

ఉ జారుని దుష్టవర్తనుని సజ్జనదూరు నసత్యవాది
నిఁ, జోరుని లుబ్ధు నిర్దయుని జూదరి బ్రాహ్మణ
వృత్తిఘాతుకుఁ, క్రూరుని ధర్మదూషకుని గూ
డక నిత్యము సర్వకల్మషో, త్తారములైన శ్రీహరి.

ఉ. భూసురవృత్తిపోషకుల భూతదయాళుల పుణ్య
వర్తనా, భ్యాసుల మాతృభక్తిపరిపాలననిష్ఠుల
నాత్మతత్త్వవి, న్యాసుల సత్యభాషుల ననంతుని

దాసులఁ గూడి నిర్మలో, ద్భాసురలీల శ్రీహరిప
దమ్ములుకోరి భజించుచిత్తమా. 87

## దశావతారవర్ణనము.

ఉ. అండజ కూర్మ సూకరమృగాధిపకుబ్జకుఠారి ధారి
మా, ఖాండకులాచ్యుతాగ్రజపురాసురభేదక
తాదిచర్యలక్, తాండవచండిమక్ దితిజదర్ప
ము లార్పఁగ నేర్చువంట నీ, దండఁగలందు శ్రీ
హరి... 88

ఉ. నీరజసంభవుండలిసి నిద్దురఁబోయినరాత్రి చోరుఁ
డై, యారసి వేదముల్గొనుచు నంబుధిఁజొచ్చిన
సోమకాసురు, న్వారకత్రుంచి వేదములు నల్వకొ
సంగినమత్స్యమూర్తి మ, ద్భారముఁ బూను
శ్రీహరి... 89

చ. కడువడి మందరా చలము కవ్వముగా ఫణిరాజు
త్రాడుగా, జలధిమథింప నంబుధిని శైలముగ్రుంగఁ
గ దేవదానవుల్, తడఁబడివేఁడ గూర్మమయి త
ద్గిరిఁదాల్చినశౌరి నిన్నుహో, తడయక ప్రోచు
శ్రీహరి... 90

ఉ. ఈతిబిఁ జుట్టిపట్టుకొని హేమపురసాతలచారి
యైన హేమనేత్రుని బట్టికొట్టి సకలామరులెన్నఁ
గ భూమినిఁ కోఱపై, దక్షతఁదాల్చినట్టి క్రతువర్ష్మి

దయామతి నిన్నుఁ బ్రోచునే,తక్షణమందు శ్రీహరీ.

చ. హరిగిరినిందుఁజూపుమన హాంకృతి స్తంభముఁజక్క
నందుభీ, కరనరసింహుఁడై వెడలి గ్రక్కున రక్క
సు డొక్కఁజించిని, ర్భరముగఁ దత్సుతున్నె నరు
బాయకప్రోచుమహానుభావుఁడి, త్తటినిను బ్రో
చు శ్రీహరి... 92

చ. సురలను బాఱదోలి బలిసుస్థిరతన్ భువనంబులేల
సుం, దరవటువేషియై ధర పదత్రయదానము
వేఁడి తద్బలిం, గరుణగలంచి వజ్రికి జగత్రయ
మిచ్చినశౌరి నిన్ను నా, దరమునఁబోషిచు శ్రీ
హరి... 93

ఉ. కంటకులైనరాజులను గట్టిగనాలములందు గం
డ్రగొ, డ్డంటను జక్కడంచి ప్రకటంబుగఁ ద
ద్రుధిరప్రవంతులై, దింటను బైతృకంబు లొగిఁ
దీటిచి భార్గవరాముఁడైన బ, ల్దంటనెటింగి శ్రీ
హరి... 94

చ. తరణికులంబున న్బొదమి తాపసి జన్నముగాచి
తాటక న్బొరిగొని శంభువి ల్లునిమి భూమిసుత
న్వరియించికానల, న్దిరిగి పడంతికై యని నెదిర్చి
న రావణకుంభకర్ణుల, న్దఱిగినజోదు శ్రీహరి...

చ. హలధరమూర్తియై హరికినగ్రజుఁడై జనియించి

